# గాంధిజీ శతకము.



గ్రంథకర్తలు:

సద్బ్రహ్మశ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య సచ్ఛాస్త్రిగారు.



ప్రకాశకులు:

రాధాకృష్ణ అండు కంపెనీ,

బెజవాడ.

బెజవాడ

రాధాకృష్ణ ముద్రాక్షరశాలలో ముద్రింపఁబడినది.

1941



వెల రు. 0—5—0

# పీఠిక.



"గాంధిజీ" మహోత్తమకార్యములను సర్వజనులకుఁ దెలియు మృదుమధురశైలిలో పద్యరూపముగా వెల్లడించుట మంచిదని మిత్రులు సూచించిరి. దానికి ఫలముగా ఈకృతిని రచించితిని. కాని యాలోకోత్తరపురుషుని విశ్వవ్యాప్త మహోత్తమమూర్తిని సమగ్రముగాఁ బ్రదర్శించుటకీ చిన్న కృతి యెంత!. చంద్రునకు ఒక నూలుపోగు! కదా?.

బాలబాలికలకు క్లిష్టత లేకుండుటకు సంధిని పెక్కుచోట్ల విడిచితిని. పండితులు క్షమింతురుగాక!.

సబ్రాహ్మణాశ్రమము
బెజవాడ.
1—9—1941.

దుగ్గిరాల రాఘవచంద్రయ్య
సచ్ఛాస్త్రి.




# గాంధిజీ శతకము.

— భారతదేశసేవ —



శా॥ స్వాతంత్ర్యంబు తొలంగఁ దేజమది స
ర్వమ్మున్ నశింపంగఁ దా
నేత్రోవంగనలేక చిక్కి శవమై యెం
తే విహీనస్థితిన్
హా! తండ్రీ! నను గావవేయనుచు దీ
నాలాపయై దైవమున్
చేతుల్మోడిచి మ్రొక్కు భారతిని ర
క్షింపంగదే గాంధిజీ!.

ఉ॥ కొడుకులయందుఁ బెద్ద విల
కోటులుగాఁగల మర్త్యులందు నొ
క్కఁడు నిను బోలఁజాలఁడు జ
గమ్మున భారతి నిల్పనెంచి నీ
శుఁడు నినుబంపెనన్న నుడి
సూరులు భారతమందు నెల్లెడన్
గడుముద మొప్ప నాడుదురు
కావవె భారతి నీవు గాంధిజీ!. 2

శా॥ "ప్రాచీనమ్మగు కీర్తియున్ విభవముం
బాడాయె లోకమ్ములో
నేచోటన్ గడు వంచనల్ గలిగె ని
స్సీ! యింక మోమెత్తి నే
నేచక్కిన్ భువి సాటిదేశముల నీ
క్షింతున్ శవాకారనై
హా! చక్రీ!" యని యేడ్చు భారతికి ది
క్కై మన్నువీ గాంధిజీ!. 3

ఉ॥ "కోటుల పుత్రికుల్ తినుట

కుఁ లవమైనను లేక నేఁడు ము

ప్పూటల కొక్కపూట లఘు

భోజనముం బొనరింతురక్కటా!

కూటికి లేక కుందెదగు

కోట్లజనమ్ముల నేలువారలీ

వేటికి రక్ష సేయ!" వని

యేడ్చెడి భారతిఁ బ్రోవు గాంధిజీ!. 4

ఉ॥ "గుడ్డలు తాల్ప నేరకయుఁ

కూటికి గంజిని పొందలేకయుం

మడ్డితనమ్ము మైమునువు

మన్న జనమ్ములు నేఁడు భూమిలో

దొడ్డతనమ్ము రాజతయుఁ

దొరపుఁదేజము నందె; నక్కటా!

బిడ్డలకింత చేటె?" యని

వేఁడెడి భారతిఁ బ్రోవు గాంధిజీ!. 5

## హరిజనసేవ



ఉ॥ భారతభూమి కెంతయును
బాడియుఁ బంటయునిచ్చి సౌఖ్యముల్
గూరుచువారి నంటుకొనఁ
గూడని పంచములంచు దగ్గఱన్
జేరఁగనీక బాధలు ర
చించెడి యక్కృతి తప్పటంచు నే
ర్పార వచించి మాన్పి యశ
మందితి వెంతయు నీవు గాంధిజీ!. 6

ఉ॥ పంచములంచుఁ బిల్చుటది
పాపమటంచును బల్కి యెంతయు
న్మంచితనమ్ముతో హరిజ
నమ్ములు నాఁజనుపేరు నిచ్చి ధ
ర్మాంచితరీతి హైందవుల
యాదరణమ్మును బొందఁజేసి ర
క్షించితి కోట్ల సజ్జనుల
నెల్లరు మెచ్చఁగ నీవు గాంధిజీ!. 7

ఉ॥ "పిల్లల నంటుచుందుర్ మఱి
ప్రేముడి నెద్దుల నంటుచుందుర్ మ
మ్మెల్లర మాలమాదిగ లి
సీ! తొలఁగుండని తోలుచుందురీ
యెల్లని కార్యముల్ విడువుఁ
డో!" యను పూజ్యులు పంచమాహ్వయుల్
చల్లని నీదు నేతలకు
సంబరమందిరి నేఁడు గాంధిజీ!. 8

ఉ॥ "గ్రామము చెంత కేఁయును
రాదగరందురు మమ్ము నక్కటా!
యేము రచించినట్టి దోస
గేమొకో! తన్నకుమారులందు మ
మ్మీమెయి చూడ ధర్మమొకో?
యీశ్వర!" యంచును పంచమాఖ్యులన్
ప్రేమను రక్షసేసితడుఁ
బేరిమి కూర్చితివౌర! గాంధిజీ!. 9

చం॥ "హరిజనులన్న మానవులు
నాదురు బిడ్డలు నాకు; నేల దు
ర్భరమును నింద్యమాగతిని
వారల వక్కట గ్రామదూరులన్
నెఱపుదు?" రంచు నీశుఁడు గ
ణింపఁగరాని విచారమందుటన్
సరసత నిల్పఁ జాలితివి
సజ్జనమౌళివి కాదె? గాంధిజీ!. 10

ఉ॥ "ఏ మును దేవు బిడ్డలమె
యేటికి గుళ్ళకు బోవనీరొకో!
గోమునఁబోయి మ్రొక్క కల
కుందులనెల్లను విప్పిచెప్పి "యో
స్వామి! మమున్ మహాపదలఁ
బడ్డ జనమ్ముల రక్షసల్పుమం
చేమును కోరరాదె?" యను
నేడ్పులు వాపితివౌర! గాంధిజీ. 11

చం॥ "కొడుకులయందుఁ గష్టములఁ
గుందెడివారలె తండ్రి ప్రేమమె
ప్పుడుఁ గడుఁజూపఁగొందురిగద?
భూస్థలి నెందునులేని రీతి నీ
వ[illegible]పున పంచమాళిమము
వాకొనరాని యనేక బాధలన్
గుడుపుదె? దేవ"! యన్జనులఁ
గూరిమిఁ బ్రోచితివౌర! గాంధిజీ!. 12

ఉ॥ "ఆపదఁగుందు పుత్రుల ద
యామతిఁబ్రోతురు తండ్రులెందు మా
పాపమిదేమి? కట్టుటకు
బట్టలు తింటకుఁ గూడులేని మ
మ్మోపరమేశ! నీదు గుడి
యొద్దకుఁ బోవఁగ నీవట"ంచు సం
తాపముచెందు పంచముల
బాధలు పాపితివౌర! గాంధిజీ!. 13

చం॥ ఇరువదియొక్కనాళ్లు తప

మెల్ల జగమ్ములు మెచ్చఁ జేసిఁ యా

హరిజనులగ్రవర్ణముల

యంతటివారలయన్న సత్యముఁ

గఱపితివెల్ల భారతికి

గల్గెను మోదము హైందనాళికిఁ

నెఱపితివెంతొ మేలు మహి

నిల్పితి హైందవజాతి గాంధిజీ!. 14

ఉ॥ నీ తపపుఁ ఫలమ్మునను నేఁడు హి

మాచలసేతుమధ్యపుఁ

భూతలమెల్ల పంచముల

పూజ్యులనట్లును మిత్రులట్లుగా

చూతురు హైందవుల్ మఱియు

చోద్యము పంచమసేవ గౌరవం

బై తనరెఁ సవర్ణులకు

నారయ నీతప మెంతొ! గాంధిజీ!. 15

## త్రావుఁడు

ఉ॥ త్రావుడు పాపమన్న నుడి
తప్పి దినమ్మును త్రావి సంపదల్
పోవఁగ దేహపాటవము
పోవఁగ నిల్లును నోళ్లు నాశమై
చేవతొఱంగి దీనులయి
చింతిలు వారలఁ ద్రావకుండు స
ద్భావము వ్యాప్తిచేసితివి
భారతభూమిని నేఁడు గాంధిజీ!. 16

మ॥ తమ సంతానము ధర్మపత్నియు కడుఁ
దర్షమ్ముతో నిత్యముఁ
దమ సంపాదనమంది జీవనము వా
త్సల్యమ్ముమై చేయుచుం
డ మహాపాపుల చెల్మిఁ ద్రాగుడులపా
లై తొంటి సౌభాగ్య సౌ
ఖ్యము లేగఁ గడుఁ గుందువారలకు ర
క్షఁ గూర్చితౌ గాంధిజీ!. 17

ఉ॥ కోటుల పంచమాహ్వయులు
కూటికిలేక కృశించుచుండ్రు గదుర
జేటులు చెందఁ గారణము
ఛీ! యని యెల్లరు నాఁడు తాఁకుచుండుర
గాటపుఁ బ్రేమతో వదలఁ
గా మదిఁబూనక నల్పుచుంటయుర
మాటను నేర్పి తాఁకుఁడును
మానిపినాఁడవు గాదె? గాంధిజీ!. 18

ఉ॥ గొప్పకులమ్ము వారమని
గొంతుక పెంచి వచించువారిలో
నిప్పటి పాపకాలమున
నెందఱో తాఁకుదురన్న సత్యముర
జెప్పి తొలంగఁజేసి కడు
శ్రీకులఁ జేసిన ధర్మరాజ! మే
మొప్పగిదిర నినుర మఱతు?
మేరును సాటియె నీకు? గాంధిజీ!. 19

ఉ॥ దారిద్ర్యము చేత చౌర్యమున
ధార్మికవృత్తియు ఘోరహత్యలున్
భూవలయమ్మునన్ బ్రబలు
మున్నును నేఁడును భారతావనిన్
దారిద్ర్యము పాపమౌట నవి
తక్కుడైనను నేఁడు హెచ్చెగా?
నీవది తుంపఁగల్గితివి
నీ మహిమమ్మున నౌర! గాంధిజీ!. 20

ఉ॥ కల్లుగలట్టి తావులను
ఖండనమున్ బొనరించి దేశపుం
జల్లదనమ్ము నిల్పఁడని
చోటి జనమ్ములు తావకుండఁగా
పిల్లగ భారతావనిని
పెద్దలచేఁ బలుకంగఁ జేసి నీ
చల్లని యేలికన్నిలుపఁ
జాలితి త్యాగుడునౌర! గాంధిజీ. 21

## —♦ దృష్టిదోషము ♦—

ఉ॥ భోజనవేళఁ జూచిననె
బొందును పాపమటన్న భ్రాంతి హిం
దూ జను లీశు బిడ్డలను
దూరముగాఁగను బొండటంచు న
వ్యాజముగాఁగఁ ద్రోలుట య
నర్హమటంచును దృష్టిదోష మో
భూజనులార! మానుఁడని
బోధనచేసితివార! గాంధిజీ!

మ॥ తమ వర్ణమ్ముల వారిలోఁ గులటలున్
దౌర్జన్యమూర్తుల్ దురు
ద్యమ జీవుల్ హతకాళులున్ కుడుపులం
దర్షమ్ముతోఁ జూడఁగా
నమలత్వమ్ము చెలంగు; నన్యులు పవి
త్రాత్మల్ కలారయ్యు దూ
రముగాఁ ద్యాజ్యులెయౌన్ నుడిన్ నిలిపితౌ
రా! నీవెకా! గాంధిజీ!

## — స్పర్శ దోషము —



చం॥ హయముల గోవులం దినము
నంటుదు రయ్యది పాపమన్న యా
భయమది యగ్రవర్ణముల
వారికి లేశము లేదు పూజ్యజ
న్మయగు మనుష్య భోజనము
నంగనరాని వినీచుఁగాఁగఁ జే
సి యిటులు కుందఁజేయుటేఁక
చెల్లదయంటివి మేలు! గాంధిజీ!. 24

మ॥ తమ వర్ణమ్ముననొప్పు స్వైరిణుల చెం
తన్ మెక్కఁదప్పంచు నెం
చమియున్, సజ్జనులం గులమ్మునన నీ
చత్వమ్ము వారైతి రం
చు మహాపాపులనట్లు భోజనములన్
జోటీమియుం బాపమం
చు మహాత్మా! నిజమున్ వచించి కడు మె
చ్చుంగంటివా! గాంధిజీ! 25

ఉ॥ పప్పును గూరగాయలును
పాలును బియ్యము నిచ్చు పూజ్యులం
దప్పళమందఁగా దగని
త్యాజ్యులఁజేతయు హత్య సేయునా
తప్పడువారినేని తమ
దగ్గఱఁజేరిచి యారగించుటల్
తప్పని నచ్చఁజెప్పితివి
ధన్యుఁడవారయ నీవు గాంధిజీ!. 26

చం॥ కులమునఁ బుట్టుటొక్కటియె
గొప్పతనమ్ము స్వవర్ణజాతలా
కులటలకంటె ధర్మగుణ
కోవిదులై తగునట్టి యన్య వ
ర్ణులు కడు తక్కువన్న నుడి
రూఢిగ తప్పనిచెప్పి యెల్లవా
రలు నొక పంక్తిలోఁ గుడువ
రాదను టొప్పదయంటి గాంధిజీ!. 27

## —♦ సర్వసమత్వము ♦—



చం॥ జ్ఞానముల మంచియుం జెడుగు
గొంచెమయేనియు నెంచకక్కటా
జననమదొండె పూజ్యతకు
స్థానమటంచును జెప్పుచుంటొ త
ప్పని గుణి దుష్కులమ్మున గలఁ
డైనను పూజ్యుఁడ; పూజలంద దు
ర్జనుఁడు తగండు పూజ్యతల
సంభవుడేనియు నంటి గాంధిజీ!. 28

చం॥ "జ్ఞానమదిలేక సత్కులము
కొంచెమయేనియు మేలు కూర్చునే?
కనులకు సొంపులంగురియు
గల్గిన రెల్లది పంటలేమిచే
జనముల మన్ననంబడయఁ
జాలెనె? దుర్గుణియెంతొ సత్కుల
మ్మున జనియించియున్ మహిమ
పొందడ"యంటివి గాదె? గాంధిజీ!. 29

## —• అహింస •—



చం॥ పరులు నినున్ వధించుటకు

పైఁబడినన్ లవమేని కోపమున్

ద్వరయును పొందకే విమల

ధర్మపథమ్మును ప్రేమ మార్గమున్

దొలఁగక శాంతితోలవము

దూషణసల్పక మేలుదారికిన్

తిరుగఁగఁ జేఁత మేలని వి

ధించితి ధర్మము మాకు గాంధిజీ!. 30

ఉ॥ చంపెడువాని నేనియును

సత్య మహింసయునూని క్రోధముం

జంపి దయార్ద్రబుద్ధిఁ గడుఁ

జక్కని త్రోవకుఁ ద్రిప్పుడన్న నీ

సొంపగుధర్మమున్ నెఱపు

సూరులు లోకమునందు నుందురే?

చంపకమాధురిం గనఁగఁ

జాలునె వానరమెందు? గాంధిజీ!. 31

ఉ॥ లక్షల, కోట్లఁ జంపగఁ బ
లమ్ములతోఁ జనుదెంచినట్టి యా
రాక్షసులేనియున్ బహుళ
రమ్యగుణమ్మగు నా యహింసచే
శిక్షితులౌచు సౌమ్యతను
చెందుదురీప్సిత సిద్ధికూర్తురం
చక్షయ ధర్మముంగ జపి
తౌర! మహాత్ముఁడవీవు గాంధిజీ!. 32

ఉ॥ నీదు నహింసలోఁ గలుగు
నిర్మలధర్మముగాంచి ప్రాజ్ఞు ల
వ్వాదపు సారముందెలిసి
వహ్వారెయంచు నుతింతురికాని ల
క్ష్మ్యదయితుండ వైన నది
చేయుటకష్టము నీదుశాంతపున్
వాదము నాచరింపఁగల
వారలు నుందురెయెందు? గాంధిజీ!. 33

ఉ॥ కొట్టిన కొట్టగాదగదు
క్రూరత మొట్టిన మొట్టరాదు తన్
దిట్టిన దిట్టరాదు మఱి
దేవునిఁజూచిన రీతి శత్రువుఁ
బిట్టగు ప్రేమతోఁ గనుచు
మెచ్చ జగమ్ములు మంచిదారిలోఁ
బెట్టుట శాంతుధర్మమని
వేమఱు జెప్పితి మేలు! గాంధిజీ!. 34

మ॥ మును ప్రహ్లాదుఁడు తండ్రిహింసలను నో
ర్పున్ మేల్మియా బుద్ధియున్
బూనరం దాలిచి మానసమ్మునను తా
నొక్కింతయుం గ్రోధముం
గనకే కొట్టిన దిట్టినం విసము త్రా
గం జేసినన్ వహ్నిఁ జే
ర్చిన నోర్చె న్మఱి నీవ యోర్చితివి యే
రీ యన్యు లో గాంధిజీ!. 35

ఉ॥ "యేసు"ను పుణ్యపూరుషుఁడ
యెంతయు శత్రులు క్రూరచిత్తులై
చేసిన ఘోరబాధలను
చింతిలకోర్చి "దేవదేవ! యీ
చేసిన కీడులన్ మఱవు
శిక్షయొనర్పకు" మంచువేఁడె లే
రాసరి నీవుతక్క జగ
మందొకరుండును నెందు గాంధిజీ!. 36

## పితృమాతృభక్తి



చం॥ పినతనమందె తండ్రికిని
ప్రేముడి సేవను జేయుచుంటె నూ
లును విడువంగ వేగము క
డుంగడు హెచ్చగ నింటికేగి నీ
జనకుని కెంతొసేవ కడు
సమ్మతిఁ జేసి జగమ్ము వారలె
ల్లను తలిదండ్రులం గొలువ
లక్ష్యము చూపితిఁగాదె? గాంధిజీ!. 37

ఉ॥ తల్లివ్రతమ్ము * సేయు నెడ
ధర్మమతింబనిపూని మబ్బులో
నెల్లదినమ్ముడాగినది
నేఁడు వెల్వడు వేళఁజూచి నీ
తల్లికిఁజెప్పి యామెకు ము
దమ్మొనరించితి వెన్నొనాళ్ళ నీ
వెల్లకుమెచ్చ బాల్యమున
నెంతటి పూజ్యుఁడవౌర! గాంధిజీ!. 38

ఉ॥ తల్లిని దండ్రినిం గొలుచు
ధర్మము నేకు కృశించుచుండ నీ
వెల్లపుడద్ది సల్పితెవ
రీడు? విదేశము పోవు వేళ నీ
తల్లికి మద్య మాంసములు
తాఁకనటంచును జెప్పి దానినిం
జెల్లఁగఁజేసినాఁడవటు
చేయఁగ నెవ్వడు నేర్చు? గాంధిజీ!. 39

---

తల్లిగారు చాతుర్మాస్య వ్రతము చేసెడిది. సూర్యుఁడు మబ్బులనుండి వెలికివచ్చినప్పుడు ప్రదక్షిణము చేసి భుజింపవలయును. సూర్యుఁడు కన్పడని రోజులలో ఆమె భుజించెడిదికాదు.

ఉ॥ తల్లిని దండ్రిఁ గావడిని
దాలిచి దేశములందు దిప్పుచుం
బెల్లుగ గొల్చు నా * శ్రవణుఁ
బ్రీతిగ జీవితమెల్లవీడకే
యుల్లమునందు గొల్తువట
యుత్తమ భక్తిని తల్లిదండ్రులం
ఎల్లరు నట్టిభక్తిఁగన
నెంచుచు పూజ్యుడవౌర! గాంధిజీ!. 40

— హిందూ మహమ్మదీయ మైత్రి —

ఉ॥ హిందువులున్ మహమ్మదు భ
జించెడువారును నన్నదమ్ము లీ
చంద మెఱింగి సోదరుల
చేడ్వన నూళ్లను భేద బుద్ధి లే
కెందును నొక్కటౌచు వసి
యించుచు నుండుఁడు పోరుచుండినం
బొందుదు రెవ్వరున్ జెడుగు
పో!" యని చెప్పితిమేలు గాంధిజీ!. 41

* శ్రవణుఁడు వృద్ధులగు తలిదండ్రులను కావడిలో మోసికొని సర్వ సేవలు చేయుచు తీర్థయాత్రలు చేయించెను.

మ॥ ఒక గ్రామంబున రెండు నామములతో
నున్నట్టి మీ రెందు పై
త్రికదుఃఖ హెచ్చుగఁ బూనఁగావలదె? వి
ద్వేషంబు నందంగ మే
లౌనా? యిండ్లగ్నికి పాలుగాఁ దురకఁ జే
టొందించి హిందూజనుల్
సుఖమందంగను జేయ నేర్చునె?” యటం
చుం జెప్పితో! గాంధిజీ!. 42

ఉ॥ ఎండయు వానయుల్ గలవు
హెచ్చగుపంటలు నొక్క రీతిగా
నుండును హిందు ముస్లిముల
కొక్కటనుండెడి వారలందు వే
ఱుండునొకో? మతంబునకు
నొక్కొక తీరుగ సోకుచుండునే?
కండు హితుల్ మిముంగని జ
గత్పతిమెచ్చెడు నంటి గాంధిజీ!. 43

## —♦ ప్రజా సేవ ♦—



శా॥ పాకీదొడ్లను బాగుచేసితివి భూ
పానీకముల్ మెచ్చఁగా
నే కాలమ్మున నేరునర్ విననియ
ట్టీవార! రాజ్యాంగవుర్
నాశన్ దిప్పితి వెల్ల రాజ్యవిదు లా
రా! యంచు కీర్తింప నీ
కీ కాలమ్మున నెందు నీడుగలరే?
యీ సేవలన్ గాంధిజీ!. 44

చం॥ ధనమది కుప్పతెప్పలుగ
దగ్గఱకున్ జనుదెంచినప్పు వ
ద్దని తన పొట్టకైకొనక
తాజనియించిన దేశమాత కె
ల్లను త్యజియింపఁజాలితివి
లచ్చినిగోరని మానవుండు భూ
మిని నొరుఁడున్నె? త్యాగమున
మిన్నవుకాదొకో నీవు? గాంధిజీ!. 45

ఉ॥ బీదలఁ గూలివారలను
    బ్రేమను జేర్చుచువారి నెంతయో
యాదరబుద్ధి నెల్లపుడు
    నారయుచుండుట నాఫ్రికాస్థలిన్
"బీదలబంధు" వంచు నిను
    బేర్కొని శాస్త్రుల రక్షణార్థమై
కాదె నినున్ సృజించెను జ
    గత్పతి భూతలమందు? గాంధిజీ!. 46

శా॥ చంపారణ్యమునందు రైతులను భూ
    స్వాముల్ మహాబాధలన్
ముంపంబూనఁగఁ గావవేయనుచు మి
    మ్ముంగోర రక్షార్థివై
"చంపారన్" స్థలికేగి భూమిపుల శి
    క్షాదక్షతం గెల్చి ర
క్షింపఁజాలితిగాదె లక్షలను నీ
    కేరీడౌకో గాంధిజీ!. 47

మ॥ తలపన్నుల్ విధియింప నాఫ్రికను ల
త్యంతంబు దుఃఖాత్ములై
ఇల నెవ్వారలు రక్ష సేతురని యెం
తే నెంచి నిన్ వేడఁగా
బలవద్భూపు నెదిర్చి గెల్చితివిగా?
పన్నుం దొలంగించి? నీ
కిల నెవ్వారలుసాటి? యీశు సరి నీ
నే యందు ప్రెసూ గాంధిజీ!. 48

— క్ష మ —



మ॥ ప్రజలెల్లందను గౌరవమ్మునఁగనన్
బారిష్టరై యెంతయున్
విజయమ్మొచ్చగ సంపదల్ చెలఁగఁగా
వెల్గొందు కాలాన నీ
చజనుండొక్కరుఁ డాఫ్రికాను గుణ మెం
చన్ లేక నిన్ దన్ని నో
ర్చి జగత్కీర్తినిగంటి శక్తుడవయై
శిక్షింప కే గాంధిజీ!. 49

చ॥ సకల జగమ్ము నీదగు పవి
శస్త్రపు ధర్మముగాంచి భక్తితో
"సకలుష దైవరూపుఁడు మ
హాత్ముఁడు గాంధిజి తా "నహింస" యు
న్నకృతిని తల్లిభారతి పొ
నర్చిన పున్నముచే సృజించె వే
ఱొక తలమందు పుట్టఁగల
దో కొ యి"దంచు నుతింతురి గాంధిజీ!. 50

ఉ॥ చాకలి మంగలుల్ సలుపు
సర్వవిధమ్ముల సేవలుఁ గదుఁ
శ్రీ కలవాడవయ్యును ర
చింపఁగ జంకక చేసికొంచు దో
షైకపరుల్ హసించునపు
"డార్యుఁడు వీనినిఁ జేయ నీచుఁడో
నే కడు ధర్మియయ్యును? ని
సీ! యవి చెల్లవ"యంటి గాంధిజీ!. 51

చం॥ మతములవెల్ల నొక్కటను
మాన్యపుభావముఁదాల్చి యెంతొ స
మ్మతి తనరంగ క్రైస్తవుల
మంచిని, ముస్లిములందు నొప్పు మం
చితనముఁజేర్చి హిందువులఁ
జేరిన చెడ్డలు తుంచివైచి స
న్మతముల సారముల్ నిలుపఁ
జాలితి వర్తనమందు గాంధిజీ!. 52

ఉ॥ పంచములన్న పేరిడుచు
పాపమెఱుంగని మర్త్యకోటులన్
వంచనతో స్పృశింపఁదగు
వారలుకారని చెప్పుటద్ది కా
వించెఁగళంక ముత్తమపు
వేదమతమ్మునకంచుఁ దెల్పి త
ప్పించితివా మతమ్మున జ
నించిన మచ్చను నీవు గాంధిజీ!. 53

## —◆ సంఘ సంస్కారము ◆—

చం॥ చినతనమందె పెండిలిని
చేయుట దోషమటంచుఁ జెప్పి క
న్నె నెనిమిదేండ్లయుప్డ వరు
నిం జతగూర్చుట మేలటన్న బు
ద్ధిని విడుఁడయ్య హైందవులు
దిద్దుకొనుండది చెడ్డకార్య మం
చును వచియించి మేలుగతిఁ
జూపితివెల్లరుమెచ్చ గాంధిజీ!. 54

ఉ॥ పెండిలివేళ విందులకు
వేడ్కలకున్ గడు ఖర్చుసేయుటల్
దండుగ వాని మానుటది
ధర్మమటంచు ఋణమ్ముచేయుచో
మొండగు నాస్థి నాశమయి
మీదనుగీడు జనించుగాన మీ
పెండిలులన్ మితవ్యయము
పేరిమిఁ జల్పుఁడయంటి గాంధిజీ!. 55

## —♦ స్వ రా జ్య ప్ర దా న ము ♦—



ఉ॥ శీతనగమ్మునుండి యల
సేతువుదాఁకను వ్యాప్తమైన క్షో
ణీతలమెల్లనుం దిరిగి
నీ వనిశమ్మును బోధచేసి ని
ద్రాతురులట్లు లజ్ఞులయి
రాజ్యము నేలఁగ కోర్కెలేని యీ
జాతికి సత్ప్రబోధమును
జల్పవె తేజముగల్గ గాంధిజీ!. 56

ఉ॥ భారతికిన్ స్వరాజ్యమది
వచ్చుటకై పడరాని పాటులం
గోరి వహించి చీఁకటిని
గ్రుంగుచునుండిన యార్యభూమి వి
స్తార కళాసుశోభితము
చల్పి స్వరాజ్య పదమ్ము నందఁగాఁ
జేరిచితీవు నీ సలుపు
సేవల నెన్నఁదరంబె గాంధిజీ!. 57

—♦ హిందూమతభక్తి ♦—



చం॥ మతములు సర్వముం జదివి
మాన్యగుణమ్ములు స్వీకరించి యు
న్మతియది వేదపుర్ణ మతము
నన్నిలుపంగను నేర్చినాఁడ వె
ట్టి తఱిని వేఱుత్రోవలు న
టింపవు పూనవు; వేదధర్మపుం
జతురుడవౌర! హైందవుల
జాతికిరత్నమవీవు గాంధిజీ!. 58

ఉ॥ ఆలయమందు విగ్రహము
నర్చనచేయుట తప్పటంచు వా
గ్జాలములొప్ప వంగకుల
శాస్త్రిలు బ్రహ్మసమాజమెంతయుర్ణ
మేలని భారతీయులన
మేయముగాఁగను జేర్చుచుండఁబోఁ
జాలవ యమ్మతమ్మునకు
సత్యమెఱింగిన నీవు గాంధిజీ!. 59

## —♦ స త్య ము ♦—



శా॥ సత్యమ్మెప్పుడు పాలనమ్ము సలుపన్
జన్మించితీవౌర నీ
సత్యాసక్తి జగమ్మునందొక హారి
శ్చంద్రున్ వహించెన్ భళీ!
సత్యస్ఫూర్తి యుతండు పెద్దయయి తా
సాగింప బాల్యమ్మునన్
నిత్యమ్మావది యాచరించితివిగా?
నీకీడౌకో? గాంధిజీ!. 60

ఉ॥ బంగరుకంకణమ్ము ఋణ
బాధకునమ్మియు దాని దాచి వే
యంగను జాలకయ్యు కడు
నాగ్రహమందు నటంచెఱింగియున్
దొంగతనమ్ము ధైర్యగతి
తో వచియించి యతండు నిన్ను మె
చ్చంగను బాల్యపున్ దశన
సల్పితిసత్యపునిష్ఠ గాంధిజీ!. 61

ఉ॥ గొప్పపరీక్ష గెల్చినను
 గోర్టున నిన్నొక న్యాయవాదిగా
 నొప్పఁగరాదటంచు పలు
 కొక్కటి గాఁగను నాఫ్రికాస్థలిన్
 ముప్పుగఁ దెల్లవారలు వి
 మూర్ఖత నిన్నెదిరింప సైచి నే
 రొప్పుఁగఁ బోరి గెల్చితి వ
 హో! యని శత్రులుమెచ్చ గాంధిజీ!. 62

ఉ॥ చేసిన తప్పులేరికిని
 జెప్పరు మర్త్యులు భూతలమ్మునన్
 వీసముఁదాపకీవొకఁడ
 స్వీయచరిత్రమునందు మున్ను నీ
 చేసిన తప్పులెల్లను వ
 చించితి సత్యము వెల్లడించుటన్
 నీసరివారలెందు ధర
 ణిం జనియించిరె మున్ను గాంధిజీ!. 63

ఉ॥ హిందువులందు వర్ణముల
నెక్కుడు తక్కుడు లేవటంచు నా
చందము నాచరించుటకు
సమ్మతి బాపనకన్నె భార్యగా
చెందుమటంచు పుత్రునకుఁ
జేసితి పెండిలి దానిగాంచి లోఁ
గుంది సనాతనుల్ తెగడఁ
గొంకవు లేశమయేని గాంధిజీ!. 64

మ॥ తలగుడ్డం ధరియింపఁ దప్పనుచు న
ద్దాని౦ ధరింపంగ నీ
కులపుఁ వారికి హక్కు లేదనుచు తాఁ
గోపంబుతో న్యాయ మూ
ర్తి లఘుత్వంబునఁ బల్క వీడక కడుఁ
ధిక్కారమిూయాజ్ఞ హిం
దులకంచుఁ జయమాఫి్రకాను గనవే?
తోషమ్ముతో గాంధిజీ!. 65

ఉ॥ హిందువు లాఫ్రికాస్థలిని
నెంతయుహీనత తెల్లవారిచేఁ
బొందుచు వారివీధులను
బోవుటకేనియు హక్కులేకయే
పొందెడి బాధ పంచములఁ
బొందఁగఁజేసెడి పాట్లకుర్ ఫలం
బందుటెయంచు వర్ణముల
కారసి చెప్పితిమేలు గాంధిజీ!. 66

— శాకాహార దీక్ష —



ఉ॥ సీమకు నేగువారలు రు
చింగని మాంసము మెక్కుచుండఁగా
నేమము నాల్గు వర్ణములు
నిల్పఁగ నేర్చితి శాకభోజనం
బా మహియందుఁ దక్కుడయి
యుందఁగరాని యవస్థలిచ్చినర్
సీమది జంకులేకకడు
నెమ్మది నోర్చితివార! గాంధిజీ!. 67

ఉ॥ శాకపు భోజనమ్మదియు
సాధ్యముకావున నాంగ్లభూమిలో
ఆఁకలి కాల్పఁగాఁదొడఁగ
నానగరమ్మున నెన్నో క్రోశముల్
జీకటులందు గ్రుమ్మరుట;
చిటికి మాటికి క్రొత్తచోట్లకుం
బోఁకయు గల్గినన్ మెసవఁ
బోవవుమాంసము నీవు గాంధిజీ!. 68

శా॥ శాకాహార సమస్య యాంగ్లులకు ని
స్స్వార్ధమ్ముగమైఁ జెప్పఁగా
శాకాహారుల సంఘమున్ నిలిపి మాం
సంబుం భుజింపఁగ కీ
డే కల్గున్ గుణముండదంచు సభ లె
న్నేఁజేసి బోధించి యెం
తో కీర్తింగనఁ గల్గితో చదువు నం
దున్నప్డె యోగాంధిజీ!. 69

## —♦ ఆర్తరక్షణము ♦—



ఉ॥ నాలవవంతు పంటగల
నాఁడును శిస్తు వసూలు చేయఁగా
మేలగునే విడుండనుచు
మేలిమి పల్కులు పల్క సుంతయుం
బాలకులొప్పకుండ నొక
మాటను రైతులనిల్పి "ఖేడ" లో
నేలిక గెల్చి శిస్తానఁగ
కే జయమిచ్చితిగాదె? గాంధిజీ!. 70

ఉ॥ ఆకలిబాధచే కడున
హమ్మదుబాదున ఫ్యాక్టరీలలో
వాకొనరాని బాధలను
బడ్డజనమ్ములు కూలి హెచ్చుగా
మాకిడుఁడన్న స్వాములకు
మానసమెక్కకయుండ సత్య దీ
క్షాకృతి నన్నముఁ విడిచి
యార్తులఁబ్రోచితివె నీవు? గాంధిజీ!. 71

—♦ మిత్రప్రేమ ♦—



చం॥ తిలకును దైవమంచును ను
తించుచు దేశజనాళులెంతయున్
గొలువఁగ నమ్మహామహుఁడు
కొల్చెను నిన్ను మహాత్ముఁగాఁగ; భూ
వలయమునందు సాటియగు
వాఁడొక నాయకుఁడున్నె నీకు? నీ
నలిపిన సేవ దైవత నొ
సంగెను భూమిని మేలు గాంధిజీ!. 72

చం॥ తిలకొనరించు సేవలకు
దీర్చితిఁగాదె ఋణమ్మునెల్ల నా
కలుషములేని పూతునకు
గౌరవమీయ "స్వరాజ్యకోశమున్"
నిలిపియుఁ గోటిరూప్యములు
నెమ్మివసూలొనరించియున్; నినున్
గలసిన మిత్రకోటి నొక
నాఁడును వీడవుగాదె? గాంధిజీ!. 73

ఉ॥ దేశవు బంధుఁడై జగతి
దీప్తినిగాంచిన చిత్తరంజనుం
డీశుని చెంతకేగఁగ న
హీనములైన తదీయసేవలం
దేశము శాశ్వతమ్ముగ ను
తింపఁగ హాస్పిటలొండు నిల్పి భూ
మీశ సమానుసత్పురుషు
నెంతయుఁ గొల్చితీవు గాంధిజీ!. 74

మ॥ నినుభక్తింగడు గొల్చిరా నెహురు లెం
తేఁగాసవారిర్వురా
మనమందెంతయుఁ బ్రీతితోఁగనుచు స
న్మానార్హ మాస్థానమం
దునుపంజాలితి; బాల నెహ్రుఁగడు ము
ద్దుంగూర్చు బాల్యమ్ము నా
టనె యాధ్యక్షతనిచ్చి కాంగ్రెసను మిం
టం జేర్చితౌ గాంధిజీ!. 75

శా॥ రాజేంద్రుండతఁడెట్టి సత్యధనుఁడై
రాజిల్లెనోగాని దా
రాజై నీ హృదయాంతరిక్షమున సా
మ్రాజ్యంబు కావించుచున్
రాజిల్లెన్ గడు నప్పటేలు సమమా
రమ్యాకృతిన్ దాల్చుచున్;
పూజాపుణ్యము లెంతగా సలిపెనో
పూర్వమ్మునం గాంధిజీ!. 76

ఉ॥ వల్లభభాయి భక్తుఁడఁట
వహ్వారె యాతఁడు సర్వభూమికిన్
వల్లభుఁడౌటకుం దగిన
వాఁడగు టెల్లను నీదు చెల్మియుం,
గల్లయుఁ బాపమంటక జ
గమ్మును బ్రేమమునఁ గొల్చు చిత్తపుం
దెల్లఁదనమ్ము గల్గుటనె
దేవసమానసుమిత్ర! గాంధిజీ. 77

చం॥ సహజ విచక్షణత్వమును,
సాధుత, మైత్రియు, శాస్త్రవిత్త్వముం
బహుళ విధేయతాగుణము,
బంధుర సంఘబలమ్ము నొప్పనా
విహితుల యుత్తమార్గతను
బెండుగఁ ద్రోయుచు లంచగొండ్లుకున్
బహుమతు లిచ్చు మిత్రులను
వారణచేయుమ నీవు గాంధిజీ!. 78

ఉ॥ త్యాగముచేసి జీవితము
నంతయు దేశముపొంకెనిచ్చు నీ
త్యాగుల రాజకీయముగ
హత్యలసేతురు తాము జైళ్ళకున్
ఏగియు సంపదల్కుడుగ
డింతురు కొందరు మిత్రులార! నీ
వా గణనీయులం దెలిసి
న్యాయమొనర్పు మహాత్మ! గాంధిజీ!. 79

ఉ॥ లంచములందువారికిడు
లక్ష్యమునేనియు సజ్జనాళిపై
నుంచమి సద్గుణమ్ములకు
నొగ్గమి నీదు స్వరాజ్యయజ్ఞపుఀ
మంచిని దున్రించుబాపుజి! యు
బద్ధము లాడుచు మిత్రులెట్లొ నీ
పెంచిన చెట్టుద్రుంచుదురు
వేఁగనులంగను వారి గాంధిజీ!. 80

చం॥ జననికి గల్గుప్రేమ మది
చాలదు వల్లభభాయి ప్రేమకుం
చును వచియించితీవతని
శుద్ధపుఁబ్రేమ మదెంతో? దానిచే
నినుహరియింప నేతపము
నీయెడఁజేసెనో? ధన్యమూర్తి నా
తని మది నెంతఁగావలతో
ధర్మవిచార! మహాత్మ! గాంధిజీ!. 81

ఉ॥ భారతదేశ సేవకయి
బాధలు పెక్కులు చెందినమ్మ; శృం
గార కవిత్వ సంపదలు
కాలెడు పూజ్య; తపమ్మునందు నీ
జేరువనుండి సేవలు ర
చించు సరోజిని భాగ్యమెందు నె
వ్వారలు పొందనేర్తురొకొ?
భారతభూమిని నేఁడు గాంధిజీ!. 82

—♦ స్వ రా జ్య దీ క్ష ♦—



ఉ॥ భారతికిన్ స్వరాజ్యమది
ప్రాప్తము కాకయుండ నాశ్రమం
బేరహిఁ జేరనేర్తునని
యేగ వహమ్మదుబాదునాఁగ నొ
ప్పారు స్వపట్టణంబునకు
అక్కట నీదగు శ్రద్ధ కెప్డు చే
కూరునొ సిద్ధి ధర్మమున
కున్ నిజభూమి త్యజింతె! గాంధిజీ!. 83

## — అభయము —



ఉ॥ భారతదేశమున్ విడిచి
పశ్చిమఖండము వోవుటద్ది త
ప్పార క్షమింపఁజాలమని
యాంగ్ల తలమ్మునుండి రాఁగనే
నేరముగాఁ గులాధిపులు
నేస్తుల, నింట భుజించినట్టి య
వ్వారల కూర్మిరుతాచు వెలి
వైవఁగ జంకవ నీవు గాంధిజీ!. 84

## — విద్యాభ్యాసము —



మ॥ పరదేశమ్మున కేగి విద్యగొనుచో
బారిష్టరౌపాంటె న
ల్లరు సారాయము నాపరీక్షవిధి చె
ల్లన్ జేయఁగా దాఁగుచుం
దురు తామిర్వదినాల్గుసారులది ని
న్నున్ సోకదాయెన్ మహా
స్థిరబుద్ధింగదు బాల్యమందె గనుటన్
సిద్ధార్థుఁడా! గాంధిజీ!. 85

మ॥ బడికెల్లప్పుడు వేళతప్పకయ పో
వన్ సర్వ పాఠమ్ములం
గడుశ్రద్ధం బఠియించుటన్; గురువులం
గావించు మర్యాద నే
బడిపిల్లందును నీడుఁగాఁ గలఁడె?; సం
భావింపఁగా బోధకుల్
కడు కీ రింబడి నాటనుండి కనవే?
గణ్యాగ్రణీ! గాంధిజీ!. 86

చం॥ చినతనమంద యాంగ్లమున
శిక్షణమందెడు వేళ పాఠశా
ల నిను పరీక్షయందు "కెటిల్"
లన్ పదముం బలకన్ లిఖింపు మ
న్న ను దోసఁగున్ రచింప కను
ణం గురుఁడారసి ప్రక్కవాని వ్రా
తను గని దిద్దఁగోరనది
తప్పనవే? ఋతమూర్తి! గాంధిజీ!. 87

## కారుణ్యము



ఉ॥ కట్టఁగ బట్టలెందఱకు
కల్గమిఁ జూడమటంచు ప్రేమతో
నట్టి జనాళి కష్టముల
యందొకపాలును జెంద నిందుఁగా
బట్టను గట్టమాని జన
వంద్యుడ! జానువుదాఁక నంతకే
కట్టఁదొడంగితీకరుణ
కల్గునె యన్యులనెందు? గాంధిజీ! 88

చం॥ కరుణను "ఖేడ" బ్రోచితివి
కాదె? నెటాలున భారతీయులం
కరుణను రక్షసేసితివి;
క్షామములంబడి మ్రగ్గుభారతిం
గరుణను స్వార్థముఁ విడిచి
కావఁదలంచితి రేఁబవళ్ళు దు
స్తరమగు కష్టమంది; నిను
దైవమనంగను రాదె? గాంధిజీ! 89

## —♦ బ్రహ్మచర్యము ♦—

చం॥ నలువది వత్సరమ్ములయి
నం తుదిఁదాఁకఁకమున్న నేమపుం
బలిమిని బ్రహ్మచర్యమును
వాస్తవరీతిగ నాచరింపఁగాఁ
దలఁచి మహర్షులేని తలఁ
దాల్పఁగ జంకిన యావ్రతమ్ము నే
ర్పలరఁగ నాచరించితి వ
హా! ఋషులీడౌకొ నీకు? గాంధిజీ!. 90

## —♦ ఖద్దరు ప్రబోధము ♦—

చం॥ తనగృహమందు నన్నమును
తానెటువండునో సాధ్వి; యట్టులే
తనగృహమందు భర్తయును
ధర్మసతీమణి నూలువడ్కఁగు
డ్డను తమ మానరక్షణకు
డాంబికవృత్తిని నిత్యసృష్టి స
ల్పనగునటంచు ధర్మమును
బల్కితివెల్లరుమెచ్చ గాంధిజీ!. 91

ఉ॥ రాటపుబట్ట యూరొమెను ధ
రాతలమందుఁ బవిత్రవస్తు వీ
నాటను దేశమందు జన
నాయకులెల్లరు వారిబట్టకుఁ
రాటమునీఁద నూలును క
రమ్ము ముదమ్మునఁ దీయుచుందురీ
గాటపు ధర్మముఁ నిలుపఁ
గల్గిన యన్యుఁడు భూమి? గాంధిజీ!. 92

—♦ నిష్కామ సేవ ♦—

మ॥ ధనకాంక్షంగొని పెద్ద వైద్యవరు లే
ధర్మార్థమై వైద్యముం
బొనరింపం దలపోయకుండఁ గడు నే
ర్పుఁ దాల్మియుఁ మీరఁగా
జని రుస్తుంజి సువైద్యశాలఁ గడు ని
స్స్వార్థుండవై న్యాయవా
దన మందుండియు సేవసేసితివి ని
త్యంబుఁ గడుఁ గాంధిజీ!. 93

ఉ॥ ప్లీడరులెందు పోరులను
బెంచుచునుందురు నీవో లాభముల్
పాడయినక్లయింటులకు
బంధురలాభముగాఁగ నొడ్లతోఁ
గూడిక కల్గఁజేయుచును
కోర్టులకెక్కకయుండఁజేతు వె
వ్వాఁడగు న్యాయవాదులను
వారల నీకును నీడు? గాంధిజీ!. 94

అహింసాచరణము



మ॥ నిను ప్రాణమ్ములు తీయఁగాఁదలచి క్రాం
తిం దెల్లవారాఫ్రికా
వనిలో స్ట్రీమరునుండి కాలిడఁగనే
ప్రాణాలకైవచ్చి చం
ప నెదుర్కొన్నను దూషణల్ సలుపకే
ప్రాణార్థమైయేని హిం
సను కావింపకె చోపుసైపవె? యహిం
సా మూర్తివో! గాంధిజీ!. 95

ఉ॥ నీ సుగుణమ్ములం దెలిసి
నిన్నును బ్రోవఁగ బుద్ధిపుట్టి పో
లీసులనేలు నా సుపరి
డెంటు సతీమణి చంపకుండ న
డ్డై సుతుఁ దల్లియుంబలె మ
హా దయఁ బ్రోవకయున్న ప్రాణముల్
తీసెడివారె; దైవముగ
తీఁగద దక్కితివీవు? గాంధిజీ!. 96

ఉ॥ భారతభూమి రక్షణము
భావమునందలపోసి దైవమా
తీరున నా సతీమణిని
దెచ్చి నినుం బొదివించి నీ యహిం
సారతి — భారతస్థలిని
సాకెదురక్షను — రక్షఁ జేసెఁగా
కేరపుడా మహాజనము
నెల్లనెదిర్చి జయింతువే? గాంధిజీ!. 97

## — లోకపూజ్యత —

ఉ॥ ఆఱుగు ఖండముల్ నిను మ
హాత్మునిగాఁగను నొప్పె; నేఁడు శృం
గారపుజ్యోతియో యనఁగ
గ్రాలుచునుందువ యెల్లభూమికిం
గూరుచు చంద్రుఁబోలి; జన
కోటుల కెల్లను నీవరత్నమౌ
కీరితిఁ గాంచితో; జగతి
కిన్ బ్రధమార్యుఁడవైతి గాంధిజీ!. 98

ఉ॥ బుద్ధుడతండు భారతిని
బుట్టి జగమ్ముల కెల్లజ్యోతియై
బోద్ధయుదైవమున్ గణనఁ
బొందెను నీవును నేటికాలపున్
బుద్ధుఁడవై యహింసయను
బోధనమున్ బొనరించి మేల్మియౌ
పద్ధతి నాచరించి బహు
వంద్యుఁడవైతివి మేలు! గాంధిజీ!. 99

మ॥ అవతారంబని హిందువుల్ గొలువ నీ
దా బుద్ధరూపంబు బౌ
ద్ధవరుల్ మెచ్చఁగ క్రీస్తు రూపమని స
త్యస్ఫూర్తితో నెంచి క్రై
స్తవులాడన్ గడు పుణ్యమూర్తివనుచున్
ధర్మాత్ములౌ ముస్లిముల్
స్తవముం జేయఁగ లోకపూజ్యతను చెం
దం జాలితౌ! గాంధిజీ!. 100

ఉ॥ వ్రాసితి సజ్జనాశ్రితుఁడ
రాఘవచంద్రుఁడ; భారతంబునన్
వ్యాసమహర్షి చెప్పఁగను
వ్రాసినవాఁడను మూఁడు పర్వముల్;
నీ సుగుణ ప్రపంచమున
నీ శతకమ్మున నేర్చినంత నే
వ్రాసితి భూమికిం దెలుపు
వాంఛ జనించుటఁ జేసి గాంధిజీ!. 101



# విషయసూచిక.





ఈ గ్రంథకర్తచే రచింపబడిన యితరగ్రంథములు.

| | |
|---|---|
| ముంటాజుమహారి (నవల) బి. ఏ. కు టెక్స్టు | 1-4 0 |
| విజయనగరసామ్రాజ్యము (రు. 500 ల బహుమతి నవల. ఇంటరుమీడియేటునకు టెక్స్టు) | 1-0 0 |
| అష్టాదశమహాపాపియగు బ్రాహ్మణునితో సాహచర్య నిరాకరణమొనర్పుము 700 పుటలు | 2-4-0 |
| గాంధిభారతరత్నములు (500 పద్య) | 0-10-0 |
| గాంధిజీ శతకము (పద్య) | 0-5-0 |
| నల్లనికుక్క తెల్లనగునా? (పద్య) | 0-2-0 |
| గాంధిజీ జీవితము | 0-12-0 |
| నెహ్రూజీ జీవితము | 0 10-0 |
| చిత్తరంజనదాసు జీవితము | 0-8-0 |
| సుభాషచంద్రబోసు జీవితము | 0-8-0 |

గాంధిమహాభారతము (పద్య. వేదవ్యాసుడు చెప్పినది.)
(1) విరాట (2) "బ్రాహ్మణనక్క" (3) ఉద్యోగపర్వములు
(అచ్చులో ఉన్నవి.)

పిల్లల గ్రంథములు.

| | |
|---|---|
| గాంధిజీకథలు మొ॥ భా॥ | 0-8-0 |
| డిటో రెం॥ భా॥ | 0-6-0 |
| నెహ్రూజీకథలు మొ॥ భా॥ | 0-4-0 |
| డిటో రెం॥ భా॥ | 0-6-0 |